ఆర్యుల దురాక్రమణతో నిర్వాసితులైన సింధు-హరప్పా ప్రజల ప్రస్థానం











# సింధు నుంచి సింధువు వైపు..!

– బెండాళం క్రిష్ణారావు

## మనవి

ఈ వ్యాసం ప్రత్యేక కథనంగా 16 సెప్టెంబర్,2018న ప్రజాశక్తి దినపత్రిక "స్నేహ" ఆదివారం అనుబంధంలో కవర్ స్టోరీ రూపంలో ప్రచురితమైంది. ఇది ప్రస్తుతం అలభ్యం కావడం వల్ల..దీని సమకాలీనత ఇంకా ఉండడం వల్ల ఈ రూపంలో పాఠకులకు అందుబాటులో ఉంచే ప్రయత్నం తప్ప ఇందులో మరింకే కారణమూ లేదు. చారిత్రక ఆధారాలతో విశ్లేషించే ఈ వ్యాసం పాఠకుల్లో మరింత అవగాహన పెంచగలదని ఆశిస్తూ....

- బెందాళం క్రిష్ణారావు



# సింధు నుంచి సింధువు వైపు..!

చరిత్ర... మానవ జీవన గమనానికి దర్పణం. అది నిరంతర చైతన్య స్రవంతి. ఎన్నో లక్షల సంవత్సరాల కిందట జీవ పరిణామంలో హోమోసేపియన్లుగా మారిన మానవ సమూహాలు ఆఫ్రికా ఖండం నుంచి తొలి అడుగేసి ప్రపంచంలో తమకు నివాసయోగ్యమైన ప్రాంతాల్లో కాలుపెట్టాయి. అప్పటినుంచీ ఇప్పటివరకూ మానవ సమూహాలు నిరంతరం సంచరిస్తూనే ఉన్నాయి. అనుకూలమైన చోట స్థిర మజిలీలు ఏర్పాటు చేసుకోవడంతోపాటు మరింత అనుకూలమైన ప్రాంతాలకు వలస వెళ్లి అక్కడ స్థిరపడుతుండడం ఇదో నిరంతర ప్రక్రియే. ఈ అన్వేషణ ఎల్లప్పుడూ కొనసాగుతూనే ఉంటుంది. ఇప్పటివరకూ చదువుకుంటున్న చరిత్ర చాలావరకూ పాలకులు, ప్రభువులకు అనుకూలంగా, శ్రామిక ప్రజా సమూహాలకు వ్యతిరేకంగా పుస్తకాల్లో రూపుదిద్దుకున్నదే. అయితే చరిత్రని తవ్వితీసే పురావస్తు శాస్త్రవేత్తలకు జన్యుశాస్త్రం, మైక్రోబయాలజీ, నానోటెక్నాలజీ తదితర వైజ్ఞానిక శాస్త్రాల సహకారంతో జరుగుతున్న పరిశోధనలు నూతన అంశాలను వెలుగులోకి తీసుకురావడానికి ఎంతగానో తోడ్పడుతున్నాయి. చరిత్రలో తమ భాగస్వామ్యం ఏమిటి? తమ మూలాలు ఎక్కడ నుంచి ఎక్కడికి ప్రస్థానం సాగిస్తున్నాయి? వంటి ఎన్నో విశేషాలను ప్రజలు తెలుసుకుంటున్నారు. ద్రావిడులైన దక్షిణ భారత ప్రజల మూలాలు సింధు నాగరికతకు చెందినవని ఇప్పటికే పలు పరిశోధనలు రుజువు చేస్తున్న నేపథ్యంలో సింధు నదీ పరీవాహక ప్రాంతాల నుంచి ఆనాటి ప్రజలు సింధువు(సముద్రం)వైపుగా దక్షిణభారత ప్రాంతాలకు చేసిన ప్రస్థానమే ఈ కథనం.

'హరప్పా-మొహెంజొదారో
క్రో-మాన్యాన్ గుహ ముఖాల్లో
చారిత్రక విభాత సంధ్యల
మానవ కథ వికాసమెట్టిది?

ఇతిహాసపు చీకటికోణం
అట్టడుగున పడి కన్పించని
కథలన్నీ కావాలిప్పుడు!
దాచేస్తే దాగని సత్యం...' అంటారు మహాకవి శ్రీశ్రీ 'దేశచరిత్రలు' గీతంలో....

అయితే, గత కొన్నేళ్లుగా తమ సాహిత్యాలను, అందులోని పిట్టకథలను ప్రస్తావిస్తూ వివిధ మతాలవాదులు ఎన్ని రకాల వక్రభాష్యాలు చెబుతున్నా చరిత్ర గుర్తులు సత్యాన్నే నినదిస్తుంటాయి. రకరకాల ఇజాల మధ్య నిజాలను సమాధిచేసే పాలకులు ప్రజల చరిత్రను ఎంత మసిపూసి మారేడుకాయగా మార్చాలని ప్రయత్నాలు చేసినా ఎప్పటికప్పుడు పరిశోధనల్లో నిగ్గుతేలే వాస్తవాలు వారి కుటిలతత్వాన్ని బయటపెడుతూనే ఉంటాయి. పాతబడ్డ పురాణాలే చరిత్రంటూ ఎంత ప్రచారం జరిగినా అవన్నీ కల్పనలేనని వాటిలో శాస్త్రీయ లేనేలేదని పురావస్తు, చారిత్రక పరిశోధనలు రుజువు చేస్తూనే ఉన్నాయి. సామాజిక శాస్త్రాల్లో అతి ముఖ్యమైనది 'చరిత్ర'. అదిప్పుడు సాంకేతిక విజ్ఞానపు వెలుగుల్లో మరింత వికసిస్తోంది. వందేళ్ల కిందటి వరకూ వైదికార్యుల నుంచే ఈ దేశ చరిత్ర మొదలైందనే అసమగ్ర ఊహలను సింధు నాగరికత శకలాలు కొట్టిపారేశాయి. అనాగరిక స్థితిలో సంచార జీవనులైన ఆర్యులు ఈ దేశంలో అడుగుపెట్టేసరికే ఆనాటికి ఆధునికమైన నాగరికత ఒకటుందని 1922లోనే బయటపడింది. పురావస్తు శాస్త్రవేత్త ఆర్.డి.బెనర్జీ సింధు ప్రాంతంలోని లార్కానా జిల్లాలో నదీతీరంలో మొహెంజొదారో పట్టణాన్ని కనుగొన్నాడు. ఆ తర్వాత తవ్వకాల్లో పశ్చిమ పంజాబ్‌లో రావి నది ఒడ్డున హరప్పా పట్టణాన్ని కనుగొన్నారు. ఆనాటి భారత పురావస్తు పరిశోధనా విభాగం డైరెక్టర్ జనరల్ సర్ జాన్‌మార్షల్ దీనిని 'సింధు నాగరికత'గా అభివర్ణించాడు.

## నదీలోయల్లోనే నాగరికతా వికాసం

ప్రపంచంలో అన్నిచోట్లా నదీలోయలే మానవ నాగరికతా వికాసానికి వాహికలైనట్టు ఇక్కడ కూడా సింధునది, దాని పరిసరాలూ మహోన్నత నాగరికతకు మూలంగా నిలిచాయి. ఈ నాగరికత ఉత్తరప్రదేశ్‌లోని రూపర్ నుంచి దక్షిణాన గుజరాత్‌లోని లోథాల్- రంగపూర్ వరకూ, పడమర అరేబియా సముద్రం సమీపంలోని సుత్కజందోర్ నుంచి తూర్పున యమునా నది ప్రాంతంలోని ఉఖ్‌లినా వరకూ సువిశాలమైన ప్రాంతంలో మూల భారతీయ నాగరికతగా క్రీ.పూ 4000 నుంచీ క్రీ.పూ. 1500 వరకూ విలసిల్లింది. ఆ సమయంలో ఇతర ప్రాంతాల్లో కూడా నదీ తీరాల్లో ప్రజలు స్థిర నివాసాలు ఏర్పాటు చేసుకుని, వ్యవసాయం, వ్యవసాయాధారిత వృత్తులు ఉపాధిగా జీవిస్తున్నారని చరిత్రకారులు పలు సందర్భాల్లో విశ్లేషించారు. ఈ నాగరికత నిర్మాతలు అనార్యులని వారే ద్రావిడులని కొన్ని దశాబ్దాల కిందటే విశ్లేషణలు జరిగాయి. అయితే, చరిత్రని వక్రీకరించడానికి అలవాటు పడిన కొంతమంది ఇది ఆర్యులదేనంటూ కొత్త వాదాలు, రకరకాల సమర్ధనలూ తెరపైకి తీసుకొచ్చి వారికి కావాల్సినంత గందరగోళాన్ని సృష్టించారు.



ఇప్పటివరకూ చారిత్రక పరిశోధనల్లో వెల్లడైన ఆధారాలను అనుసరించి ప్రపంచంలో అత్యధికశాతం మంది చరిత్రకారులు ప్రతిపాదిస్తున్న సిద్ధాంతాలను పరిశీలిస్తే.... క్రీ.పూ.1450కి పూర్వం సింధులోయలో విలసిల్లిన నాగరికత ద్రావిడులదని, వారే నేటి ఉత్పత్తి కులాలకు ప్రతినిధులని, నల్లని వర్ణంతో ఉండే ఆ వర్గాల ప్రజలే ఆర్యుల కన్నా ముందే ఈ దేశంలో నగరాలను నిర్మించారని

తేటతెల్లమవుతుంది. అంతేకాదు, క్రీ.పూ.1450 నుంచి క్రీ.పూ.1750 మధ్య కాలంలో మధ్యాసియా, యురేసియా ప్రాంతాల నుంచి ఆర్యులు తెగలు తెగలుగా భారతదేశానికి వలస వచ్చి ఈ ప్రాచీన భారతీయ నాగరికతని దఫదఫాలుగా ధ్వంసం చేశారని స్పష్టమవుతోంది. ఆ నాగరికత ధ్వంసమైన తర్వాత చనిపోయినవారు పోగా మిగిలినవారంతా ఎక్కడికి వలస వెళ్లారనేదానిపై చరిత్రకారుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి. కానీ, ఇటీవల పరిశోధనలు ద్రావిడులైన సింధు-హరప్పా ప్రజలు దేశంలోని తూర్పునున్న సముద్రతీరాలకు దక్షిణాదికి తరలి వెళ్లారని స్పష్టం చేస్తున్నాయి.



## డీఎన్ఏ నివేదికలు ఏం చెబుతున్నాయి?

సింధు ప్రజలు ద్రావిడులు కారని వాదిస్తున్నవారికి దీటైన జవాబు చెప్పేలా జన్యుశాస్త్ర పరిశోధనల ఫలితాలున్నాయి. ఇప్పటివరకూ ఈ అంశంపై లభిస్తున్న డీఎన్ఏ రిపోర్టులను పరిశీలిస్తే సింధు నాగరికత ప్రజలు ప్రోటో ఆస్టలాయిడ్, నీగ్రోలాయిడ్ (ఇండియనైజ్డ్ మిశ్రమ తెగ అయిన ఇండో-ఆఫ్రికన్‌లే ద్రవిడియన్ జాతి) జాతులకు చెందినవారని తేలుతోంది. వీరంతా ఇప్పుడు ద్రావిడ జాతి ప్రజలే అని మానవ పరిణామ శాస్త్రవేత్తలు అంగీకరిస్తున్నారు. చాలాకాలం కిందట ఇదే అంశాన్ని ప్రస్తావిస్తూ 'రుగ్వేద ఆర్యులు' పుస్తక రచయిత రాహుల్ సాంకృత్యాయన్ 'ఆర్యులు తమ విరోధులైన దస్యులను, దాసులను నాశనం చేయడమే పనిగా సూక్తాలను రాసారని' పేర్కొన్నారు. ఆర్యులు అప్పటికి

స్థానికంగా ఈ దేశంలో నివసించే ద్రావిడులనే 'దస్యులు, దాసులు' అని రుగ్వేదంలో చాలా చోట్ల ప్రస్తావించారని తెలుస్తోంది.



## ఆర్1ఎ1 తేల్చిందేంటి?

పురావస్తు తవ్వకాల్లో దేశ రాజధాని ఢిల్లీకి సుమారు వంద కిలోమీటర్ల దూరంలో ఉన్న ఒక గ్రామం 'రాఖీగడీ'లో లభించిన అస్థిపంజరం డీఎన్ఏను పరిశోధించిన శాస్త్రవేత్తలు తాజాగా ఆసక్తికరమైన అంశాలను వెల్లడించారు. కార్బన్ డేటింగ్ సాయంతో ఇప్పటికి ఆరు వేల ఏళ్ల కిందటి అస్థిపంజరాన్ని అక్కడి తవ్వకాల్లో కనుగొన్నారు. తొమ్మిదివేల ఏళ్లుగా జనావాసాలున్న ఈ గ్రామానికి పశ్చిమ దిశలో 37 సమాధులు తవ్వకాల్లో బయటపడ్డాయి. వీటిపై పుణేలోని ఓరియంటల్ కాలేజ్ ప్రొఫెసర్ వసంత్ శివరామ్ సాధే నిశితంగా అధ్యయనం చేశారు. లక్నోలోని బీర్బల్ సాహ్ని ఇనిస్టిట్యూట్ ఫర్ పాలియో సైన్సెస్‌కు చెందిన డాక్టర్ నీరజ్‌రారు, హార్వర్డ్‌కు చెందిన డాక్టర్ విగేష్ నరసింహన్ ఆ సమాధుల్లోంచి లభించిన అస్థిపంజరాల్లో ఒకదానిని ఎంపిక చేసుకుని అందులోని డీఎన్ఏను సేకరించి దానిని పరిశోధించారు. ఫలితాలను విశ్లేషించారు. ముందుగా ఈ డీఎన్ఏని శుద్ధి చేసి దాని ద్వారా జన్యు క్రమాలను రూపొందించారు. దానిని దేశంలోని మిగిలిన ప్రాంతాల ప్రజల జన్యువులతో పోల్చి చూశారు. ఈ పరిశోధనల్లో వారు కొన్ని ఆసక్తికరమైన విషయాలను కనుగొన్నారు. సింధునాగరికతకు చెందిన ఈ అస్థిపంజరంలోని జన్యువు ఉత్తర భారత దేశంలో

నివసిస్తున్నవారి జన్యువులకు సరిపోలేదు. ఉత్తర భారత ప్రజల్లో ఉండే ఆర్1ఏ1 అనే ఒక జన్యువు సింధు-హరప్పా ప్రజల్లో లేదని స్పష్టమైంది. కానీ, ఈ అస్థిపంజరంలోని జన్యువులు దక్షిణ భారతదేశంలోని ప్రజల పూర్వీకుల జన్యువుతో పోలినట్లు తేలింది. ఈ తాజా పరిశోధన ఫలితాలు సింధు నాగరికత వైదికార్యులదేనంటూ కొంతమంది చేస్తున్న వాదనలను కొట్టిపారేసింది. వారి వాదనలు ఆధారరహితమని నిరూపించింది. హరప్పా.. వేదనాగరికతలో భాగం కాదని తేలిపోయింది.



## సింధు ప్రజలు శ్రామిక వర్గాలే ...

సింధు నాగరికతలో వర్గ సమాజం ఉన్నా వర్ణ వ్యవస్థలేదని ఇప్పటికే పరిశోధనలు చెబుతున్నాయి. అత్యధిక శాతం మంది అప్పటికి వైజ్ఞానికంగా సామర్థ్యం గల శ్రామిక వర్గాలేనని తవ్వకాల్లో బయటపడిన నగరాల తీరు, భవనాలు, భూగర్భ కాలువలు, స్నానవాటికలు, ధాన్యాగారాలు, రహదారులు, ఆనకట్టలు, బావులు, దీపస్తంభాలు వంటివాటి నిర్మాణం స్పష్టం చేస్తోంది. వీరు రాతిని గృహోపకరణాలుగా మలిచారు. కంచు, రాగి వంటి లోహాలను వినియోగించారు. ఈ లోహాల తయారీకి కార్ఖానాలు కూడా ఏర్పాటు చేసినట్లు తెలుస్తోంది. ఈ నాగరికత చివరిదశలో ఇనుప లోహాన్ని కూడా వినియోగించారు. వీరికి లిపి కూడా ఉంది. బార్లీ, గోధుమలు తదితర పంటలను పండించారు.

ఏనుగు దంతాలను, నెమళ్లను, దంతాలతో రూపొందించిన దువ్వెనలను దూర ప్రాంతాలకు ఎగుమతి కూడా చేసేవారు. అక్కడ లభించిన ముద్రలు వారి చిత్ర, శిల్పకళని చాటిచెబుతుండగా, స్త్రీ మూర్తి విగ్రహం మాతృస్వామ్య వ్యవస్థకీ, ఎద్దుబొమ్మతో లభించిన ముద్రలు వ్యవసాయానికీ ప్రతీకలుగా నిలుస్తున్నాయి. ఇప్పటికీ దక్షిణభారత ప్రజల్లో ఎక్కువశాతం మంది శ్రామిక వర్గాలకు చెందినవారే. వివిధ వృత్తులపై ఆధారపడి జీవిస్తున్నవారే కావడం గమనార్హం.

## ఉత్పత్తి కులాల భాగస్వామ్యం

సింధు నాగరికతలో ప్రధానంగా ఉన్న కొన్ని వృత్తులు నేటికీ దక్షిణ భారతదేశంలో కొనసాగుతూనే ఉన్నాయి. మట్టి కుండలు, పాత్రలను ఉత్పత్తిచేసే కుమ్మరులు, వస్త్రాలను రూపొందించే చేనేత పనివారు, నూలు వడికేవారు, పత్తిని తీసేవారు... ఇలా రకరకాల ఉత్పత్తి కులాల వారి భాగస్వామ్యం ఈ నాగరికతలో ఉందని ప్రముఖ మార్క్సిస్ట్ చరిత్రకారిణి రొమిల్లాథాఫర్ తన రచనల్లో పేర్కొన్నారు. ఆమె క్రోఢకీరించిన సింధు ప్రజల జీవన విధానం దక్షిణభారత దేశంలోని ఎన్నో ఉత్పత్తి కులాల్లో ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది. వ్యవసాయ సంస్కృతి విషయాన్ని వేరేగా చెప్పాల్సిన పని లేదు. ఆర్యులు కేవలం సంచార జీవనాన్ని గడిపే పశుపోషకులైతే అంతకుముందే సింధు ప్రజలు శాశ్వత నివాసాలు ఏర్పరుచుకుని స్థిర వ్యవసాయం చేస్తూ నాగరికంగా ముందున్నారు.



## సంస్కృతిలో సామీప్యత

సింధు ప్రజల ఆచార వ్యవహారాల్లోనూ, దక్షిణాది ద్రావిడ ప్రజల జీవనశైలిలోనూ ఎన్నో పోలికలు కన్పిస్తున్నాయి. ద్రవిడ భాషకు చెందిన బ్రహుల్ ప్రజలు సింధు ప్రాంత సమీపంలో ఇప్పటి పాకిస్తాన్‌లో 20 లక్షల మందికి పైగా ఉన్నారు. సింధు ప్రజలు వాడిన పూసలు వంటివే ఇప్పటికీ దక్షిణాదిలో మహిళలు ఎక్కువగా ధరిస్తున్నారు. అక్కడి మాతృస్వామ్య వ్యవస్థలోని అమ్మదేవతే.. దక్షిణాదిలో గ్రామదేవతగా మారింది. సింధు ప్రజలు పశుపతిని, లింగాలను పూజించేవారు దానికి కొనసాగింపుగా ద్రావిడుల్లో ఎక్కువగా శివారాధన, అమ్మతల్లిని పూజించడం వంటి ఆచారాలున్నాయి. వారు ఎద్దుకు ప్రాధాన్యత ఇచ్చినట్టే దక్షిణదేశ సంస్కృతిలో కూడా ఎద్దుకు చాలా ప్రాధాన్యత ఉంది. ప్రతి శైవాలయంలోనూ నంది పేరుతో ఎద్దుని పూజిస్తారు. అంతేకాదు జనవరినెలలో సంక్రాంతి తర్వాతరోజు కనుమ పండుగను నిర్వహించి ఎద్దులకు అలంకారాలు చేస్తారు. సంక్రాంతి రోజుల్లో గంగిరెద్దులతో విన్యాసాలు కూడా చేయిస్తుంటారు. 'జల్లికట్టు'ను పోలిన సాహసక్రీడకు సంబంధించిన ఆనవాళ్లు సింధు నాగరికత ఫలకాల్లోనూ కనిపించాయి.



సింధు ప్రజల వేషధారణలో కనిపించిన ధోవతి, ఉత్తరీయాలను ఇప్పటికీ దక్షిణాదిలో ఉండే ద్రావిడులు ధరిస్తున్నారు. సింధు ప్రజలు తమ మాతృ, పురుష దైవాలకు ఆలయాలు నిర్మించారు. అప్పటికి ప్రకృతి శక్తుల పేరుతో ఇంద్ర, మిత్ర, వరుణ, అగ్ని, సూర్య వంటివాటిని పూజించే రుగ్వేద ఆర్యులకు ఆలయ నిర్మాణమే తెలియదు. ఇప్పటికీ ద్రావిడులు అధికంగా నివసించే దక్షిణాది రాష్ట్రాల్లోనే అతిపెద్దవైన ఆలయాలను చూడొచ్చు. సింధు ప్రజలు తమ పూజల సమయంలో చేసే ధూపదీపాల నివేదనలు, నృత్యాలు, సంగీత వాయిద్యాల వాదనలూ ఎక్కువగా ఇప్పటికీ దక్షిణాది ఆలయాల్లో నిత్యం కొనసాగుతూనే ఉన్నాయి. సింధు నాగరికత తవ్వకాల్లో లభించిన పూజారి విగ్రహంలోని ఆహార్యాన్నే ఇప్పటికీ దక్షిణాది అలయాల్లోని అర్చకులు, క్రతువులు చేసేవారు అనుకరిస్తున్నారు.



## దక్షిణాదికి సింధు ప్రజల పయనం

ఆర్యుల దాడుల్లోనూ, 200-900 ఏళ్ల క్షామం, వరదలు (జల ప్రళయాలు)లోనూ చనిపోయిన వారు పోగా మిగిలిన వారిలో ఎక్కువమంది దక్షిణ భారతదేశానికి తూర్పు తీరం వైపు, మరి కొందరు గంగానది ముఖద్వారం వైపు వలస వెళ్లినట్టు చరిత్రకారులు భావిస్తున్నారు. నగరాల విధ్వంసం తర్వాత ఆర్య సంస్కృతి, అందులో భాగమైన వర్ణ వ్యవస్థ వేళ్లూనుకోవడంతో అనార్యులంతా శూద్రులయ్యారు. తమకు లోబడిన వర్తకులను వైశ్యులని పేర్కొంటూ వారితో వ్యవసాయాన్ని కూడా చేయించేవారు. సప్తసింధు ప్రాంతం ఆర్యుల

ఆధిపత్యంలోకి వచ్చిన తర్వాత ద్రావిడుల వలసలు వాటి వివరాలను కొంతవరకూ తమిళనాడు ప్రాంతంలోని ప్రాచీన సంగం సాహిత్యం వివరిస్తోంది. చరిత్రలో మతం మిళితమై ఉండడం, మతాలను రాజకీయాలు అత్యధికంగా వినియోగిస్తున్న నేటి సందర్భాల్లో నిష్పాక్షికమైన చరిత్రని తెలుసుకోవడం, అధ్యయనం చేయడం చాలా వరకూ కష్టమే. కానీ లభిస్తున్న ఆధారాలను క్షుణ్ణంగా పరిశీలించి, పరిశోధించి అధ్యయనం చేయడం ద్వారా గతకాలపు పరిణామాలను సరిగా గుర్తించడానికి వీలవుతుంది.



## సింధు విధ్వంసకులు ఆర్యులే !

సింధు నాగరికత విధ్వంసకులు ఆర్యులే అన్న వాస్తవాన్ని వారి తొలి గ్రంథం రుగ్వేదమే తేటతెల్లం చేస్తోంది. రుగ్వేదంలోని ఆరవ మండలంలో పేర్కొన్న ఇంద్రుడు నిర్మూలించిన దస్య నగరం పేరు 'హరియూపియ' ఇది హరప్పా అని చరిత్రకారులు చెబుతున్నారు. రుగ్వేదంలోని ఒకటో మండలంలో అగ్ని ద్వారా ధ్వంసమైన 'నార్మిని' నగరమే మొహెంజొదారో అని చరిత్ర పరిశోధకులు భావిస్తున్నారు. రుగ్వేదంలో సింధు నాగరికత విధ్వంసానికి సంబంధించి నలభై ఏళ్లకు పైగా భరతులు తదితర ఆర్య గణాలతో కలిసి దివోదాసు కిరాత శంబరునితో యుద్ధం సాగించాడని వివరించారు. దీనినే దస్సు హత్య అని పేర్కొన్నారని ఈ యుద్ధంలో దస్యులు పూర్తిగా ఓడిపోయారని రాహుల్ సాంకృత్యాయన్ తన 'రుగ్వేద ఆర్యులు'లో రాశారు. సింధు ప్రజలు వ్యవసాయం

కోసం నిర్మించుకున్న ఆనకట్టలను విధ్వంసం చేయడం ద్వారా, అక్కడి నగరాలను (పురాలను) నాశనం చేయడం ద్వారానే ఇంద్రుడికి 'పురంధరుడు' అనే పేరుని రుగ్వేదంలో కల్పించారు. తమ శత్రువులైన సింధు ప్రజలను ఆర్యులు... నల్లని రంగుతో ఉన్నవారని, శిశ్నదేవులనీ (లింగపూజలు చేసేవారనీ) మృధ్రవచనులనీ (అసత్యాలు పలికేవారనీ) ఎన్నో చోట్ల రుగ్వేదంలో దూషణలు చేశారు. ఈ వర్ణనలను పరిశీలిస్తే ఉత్తరాదికి వలస వచ్చిన ఆర్యులు, అప్పటికే నాగరీకులైన ద్రావిడులూ భిన్నమైనవారనే స్పష్టమవుతుంది. మొహంజదారోలోనే... ఓ చోట చెల్లాచెదురుగా పడిఉన్న మృతుల అవశేషాలు బయల్పడ్డాయి. ఓ శిశువుని ఎత్తుకుని నేలకొరిగిన మహిళ, పక్కనే ఓ పురుషుడు (బహుశా భర్త కావొచ్చు)తో పాటు ఓ భీకర దాడి నుంచి తప్పించుకునే ప్రయత్నంలో హతులైన సమూహానికి చెందినదిగా ఆ సైట్‌ని పరిశోధకులు భావిస్తున్నారు.

విభిన్న ప్రయోజనాల కోసం చరిత్రని ఎవరికి వారే ఊహలతో రూపొందించుకుని, ప్రచారం చేసుకుంటున్న తరుణంలో నిజాలు వెలుగుచూస్తున్నకొద్దీ కొత్త కథలు కూడా ఎన్నో పుట్టుకొస్తుంటాయి. మతాలు, కులాల్లాంటివి మనుషులను విడదీయలేవని మానవ చరిత్రలో ఉండే విశ్వజనీనత ఎప్పటికప్పుడు నిరూపిస్తూనే ఉంటుంది. వివిధ సంస్కృతులు, సామాజిక అంశాలు, జన్యుక్రమాలు మానవజాతిని ఏకం చేస్తూనే ఉంటాయి. అయితే మూలాలను తెలుసుకోవడానికే ఇటువంటి పరిశోధనలు ఉపకరిస్తాయి. వీటిని వాదాలుగా మార్చుకుని ఒకరిపై మరొకరు ఆధిపత్యాన్ని సాధించాలనుకునే స్వార్థం ఎవరినైనా చారిత్రక విజ్ఞానపు వెలుగుల్ని చూడనీయలేదు. నాటి చారిత్రక మూలాలను నేటి సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిణామాలతో అన్వయించుకుంటూ పొరపాట్లని సవరించుకుని భవిష్యత్‌లో ప్రగతి దిశగా పయనించడమే సకల మానవాళి కర్తవ్యం.


- బెందాళం క్రిష్ణారావు

bendalamkrishnarao@gmail.com

***730 6434 888***


(Sunday,September 16,2018)

'హరప్పా-మొహెంజొదారో
క్రో-మాన్యాన్ గుహ ముఖాల్లో
చారిత్రక విభాత సంధ్యల
మానవ కథ వికాసమెట్టిది?

ఇతిహాసపు చీకటికోణం
అట్టడుగున పడి కన్పించని
కథలన్నీ కావాలిప్పుడు!
దాచేస్తే దాగని సత్యం...' అంటారు మహాకవి
శ్రీశ్రీ 'దేశచరిత్రలు' గీతంలో....

చరిత్ర... మానవ జీవన గమనానికి దర్పణం. అది నిరంతర చైతన్య ప్రవంతి. ఎన్నో లక్షల సంవత్సరాల కిందట జీవ పరిణామంలో హోమోసేపియన్లుగా మారిన మానవ సమూహాలు ఆఫ్రికా ఖండం నుంచి తొలి అడుగేసి ప్రపంచంలో తమకు నివాసయోగ్యమైన ప్రాంతాల్లో కాలుపెట్టాయి. అప్పటినుంచీ ఇప్పటివరకూ మానవ సమూహాలు నిరంతరం సంచరిస్తూనే ఉన్నాయి. అనుకూలమైన చోట స్థిర మజిలీలు ఏర్పాటు చేసుకోవడంతోపాటు మరింత అనుకూలమైన ప్రాంతాలకు వలస వెళ్లి అక్కడ స్థిరపడుతుండడం ఇదో నిరంతర ప్రక్రియే. ఈ అన్వేషణ ఎప్పుడూ కొనసాగుతూనే ఉంటుంది. ఇప్పటివరకూ చదువుకుంటున్న చరిత్ర చాలావరకూ పాలకులు, ప్రభువులకు అనుకూలంగా, శ్రామిక ప్రజా సమూహాలకు వ్యతిరేకంగా పుస్తకాల్లో రూపుదిద్దుకున్నదే. అయితే చరిత్రను తవ్వితీసే పురావస్తు శాస్త్రవేత్తలకు జన్యుశాస్త్రం, మైక్రోబయాలజీ, నానోటెక్నాలజీ తదితర వైజ్ఞానిక శాస్త్రాల సహకారంతో జరుగుతున్న పరిశోధనలు నూతన అంశాలను వెలుగులోకి తీసుకురావడానికి ఎంతగానో తోడ్పడుతున్నాయి. చరిత్రలో తమ భాగస్వామ్యం ఏమిటి? తమ మూలాలు ఎక్కడ నుంచి ఎక్కడికి ప్రస్థానం సాగిస్తున్నాయి? వంటి ఎన్నో విశేషాలను ప్రజలు తెలుసుకుంటున్నారు. ద్రావిడులైన దక్షిణ భారత ప్రజల మూలాలు సింధు నాగరికతకు చెందినవని ఇప్పటికే పలు పరిశోధనలు రుజువు చేస్తున్న నేపథ్యంలో సింధు నదీ పరీవాహక ప్రాంతాల నుంచి అనాటి ప్రజలు సింధువు(సముద్రం)వైపుగా దక్షిణభారత ప్రాంతాలకు చేసిన ప్రస్థానమే ఈ వారం అట్టమీది కథ.

అయితే, గత కొన్నేళ్లుగా తమ సాహిత్యాలను, అందులోని పిట్టకథలను ప్రస్తావిస్తూ వివిధ మతాలవాదులు ఎన్ని రకాల వక్రభాష్యాలు చెబుతున్నా చరిత్ర గుర్తులు సత్యాన్నే నినదిస్తుంటాయి. రకరకాల ఇజాల మధ్య నిజాలను సమాధిచేసే పాలకులు ప్రజల చరిత్రను ఎంత మసిపూసి మారేడుకాయగా మార్చాలని ప్రయత్నాలు చేసినా ఎప్పటికప్పుడు పరిశోధనల్లో నిగ్గుతేలే వాస్తవాలు వారి కుటిలతత్వాన్ని బయటపెడుతూనే ఉంటాయి. పాతబడ్డ పురాణాలే చరిత్రంటూ ఎంత ప్రచారం జరిగినా అవన్నీ కల్పనలేనని వాటిలో శాస్త్రీయ లేనేలేదని పురావస్తు, చారిత్రక పరిశోధనలు రుజువు చేస్తూనే ఉన్నాయి. సామాజిక శాస్త్రాల్లో అతి ముఖ్యమైనది 'చరిత్ర'. అదిప్పుడు సాంకేతిక విజ్ఞానపు వెలుగుల్లో మరింత వికసిస్తోంది. వందేళ్ల కిందటి వరకూ వైదికార్యుల నుంచే ఈ దేశ చరిత్ర మొదలైందనే అసమగ్ర ఊహలను సింధు నాగరికత శకలాలు కొట్టిపారేశాయి. అనాగరిక స్థితిలో సంచార జీవనులైన ఆర్యులు ఈ దేశంలో అడుగుపెట్టేసరికే అనాటికే ఆధునికమైన నాగరికత ఒకటుందని 1922లోనే బయటపడింది. పురావస్తు శాస్త్రవేత్త ఆర్.డి.బెనర్జీ సింధు ప్రాంతంలోని లార్కానా జిల్లాలో నదీతీరంలో మొహెంజొదారో పట్టణాన్ని కనుగొన్నాడు. ఆ తర్వాత తవ్వకాల్లో పశ్చిమ పంజాబ్‌లో రావి నది ఒడ్డున హరప్పా పట్టణాన్ని కనుగొన్నారు. అనాటి భారత పురావస్తు పరిశోధనా విభాగం డైరెక్టర్ జనరల్ సర్ జాన్‌మార్షల్ దీనిని సింధు నాగరికతగా అభివర్ణించాడు.

## నదీలోయల్లోనే నాగరికతా వికాసం

ప్రపంచంలో అన్నిచోట్లా నదీలోయలే మానవ నాగరికతా వికాసానికి వాహికలైనట్టు ఇక్కడ కూడా సింధునది, దాని పరిసరాలూ మహోన్నత నాగరికతకు మూలంగా నిలిచాయి. ఈ నాగరికత ఉత్తరప్రదేశ్‌లోని రూపర్ నుంచి దక్షిణాన గుజరాత్‌లోని లోథాల్- రంగపూర్ వరకూ, పడమర అరేబియా సముద్రం సమీపంలోని సుత్కజెందోర్ నుంచి తూర్పున యమునా నది ప్రాంతంలోని ఉఖలినా వరకూ సువిశాలమైన ప్రాంతంలో మూల భారతీయ నాగరికతగా క్రీ.పూ 4000 నుంచీ క్రీ.పూ. 1500 వరకూ విలసిల్లింది. ఆ సమయంలో ఇతర ప్రాంతాల్లో కూడా నదీ తీరాల్లో ప్రజలు స్థిర నివాసాలు ఏర్పాటు చేసుకుని, వ్యవసాయం, వ్యవసాయాధారిత వృత్తులు ఉపాధిగా జీవిస్తున్నారని చరిత్రకారులు పలు సందర్భాల్లో విశ్లేషించారు. ఈ నాగరికత నిర్మాతలు అనార్యులని వారే ద్రావిడులని కొన్ని దశాబ్దాల కిందటే విశ్లేషణలు జరిగాయి. అయితే, చరిత్రని వక్రీకరించడానికి అలవాటు పడిన కొంతమంది ఇది ఆర్యులదేనంటూ కొత్త వాదాలు, రకరకాల సమర్థనలూ తెరపైకి తీసుకొచ్చి వారికి

- బెండాళం క్రిష్ణారావు
bendalamkrishnarao@gmail.com



కావాల్సినంత గందరగోళాన్ని సృష్టించారు. ఇప్పటివరకూ చారిత్రక పరిశోధనల్లో వెల్లడైన ఆధారాలను అనుసరించి ప్రపంచంలో అత్యధికశాతం మంది చరిత్రకారులు ప్రతిపాదిస్తున్న సిద్ధాంతాలను పరిశీలిస్తే.... క్రీ.పూ.1450కి పూర్వం సింధులోయలో విలసిల్లిన నాగరికత ద్రావిడులదని, వారే నేటి ఉత్పత్తి కులాలకు ప్రతినిధులని, నల్లని వర్ణంతో ఉండే ఆ వర్గాల ప్రజలే ఆర్యుల కన్నా ముందే ఈ దేశంలో నగరాలను నిర్మించారని తేటతెల్లమవుతుంది. అంతేకాదు, క్రీ.పూ.1450 నుంచి క్రీ.పూ.1750 మధ్య కాలంలో మధ్యాసియా, యురేసియా ప్రాంతాల నుంచి ఆర్యులు తెగలు తెగలుగా భారతదేశానికి వలస వచ్చి ఈ ప్రాచీన భారతీయ నాగరికతని దఫదఫాలుగా ధ్వంసం చేశారని స్పష్టమవుతోంది. ఆ నాగరికత ధ్వంసమైన తర్వాత చనిపోయినవారు పోగా మిగిలినవారంతా ఎక్కడికి వలస వెళ్లారనేదానిపై చరిత్రకారుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి. కానీ, ఇటీవల పరిశోధనలు ద్రావిడులైన సింధు-హరప్పా ప్రజలు దేశంలోని తూర్పునున్న సముద్రతీరాలకు దక్షిణాదికి తరలి వెళ్లారని స్పష్టం చేస్తున్నాయి.

## డీఎన్ఏ నివేదికలు ఏం చెబుతున్నాయి?

సింధు ప్రజలు ద్రావిడులు కారని వాదిస్తున్నవారికి దీటైన జవాబు చెప్పేలా జన్యుశాస్త్ర పరిశోధనల ఫలితాలున్నాయి. ఇప్పటివరకూ ఈ అంశంపై లభిస్తున్న డీఎన్ఏ రిపోర్టులను పరిశీలిస్తే సింధు నాగరికత ప్రజలు ప్రోటో ఆస్ట్రలాయిడ్, నీగ్రోలాయిడ్ (ఇండియనైజ్డ్ మిశ్రమ తెగ అయిన ఇండో-ఆఫ్రికన్‌లే ద్రవిడియన్ జాతి) జాతులకు చెందినవారని తేలుతోంది. వీరంతా ఇప్పుడు ద్రావిడ జాతి ప్రజలే అని మానవ పరిణామ శాస్త్రవేత్తలు అంగీకరిస్తున్నారు. చాలాకాలం కిందట ఇదే అంశాన్ని ప్రస్తావిస్తూ 'రుగ్వేద ఆర్యులు' పుస్తక రచయిత రాహుల్ సాంకృత్యాయన్ 'ఆర్యులు తమ విరోధులైన దస్యులను, దాసులను నాశనం చేయడమే పనిగా సూక్తాలను రాశారని' పేర్కొన్నారు. ఆర్యులు అప్పటికి స్థానికంగా ఈ దేశంలో నివసించే ద్రావిడులనే 'దస్యులు, దాసులు' అని రుగ్వేదంలో చాలా చోట్ల ప్రస్తావించారని తెలుస్తోంది.

## ఆర్1ఎ1 తేల్చిందేంటి?

పురావస్తు తవ్వకాల్లో దేశ రాజధాని ఢిల్లీకి సుమారు వంద కిలోమీటర్ల దూరంలో ఉన్న ఒక గ్రామం 'రాఖీగఢీ'లో లభించిన అస్థిపంజరం డీఎన్ఏను పరిశోధించిన శాస్త్రవేత్తలు తాజాగా ఆసక్తికరమైన అంశాలను వెల్లడించారు. కార్బన్ డేటింగ్ సాయంతో ఇప్పటికి ఆరు వేల ఏళ్ల కిందటి అస్థిపంజరాన్ని



అక్కడి తవ్వకాల్లో కనుగొన్నారు. తొమ్మిదివేల ఏళ్ల_గా జనావాసాలున్న ఈ గ్రామానికి పశ్చిమ దిశలో 37 సమాధులు తవ్వకాల్లో బయటపడ్డాయి. వీటిపై పుణేలోని ఓరియంటల్ కాలేజ్ ప్రొఫెసర్ వసంత్ శివరామ్ సాధే నిశితంగా అధ్యయనం చేశారు. లక్నోలోని బీర్బల్ సాహ్ని ఇన్‌స్టిట్యూట్ ఫర్ పాలియో సైన్సెస్‌కు చెందిన డాక్టర్ నీరజ్‌రాయ్, హార్వర్డ్‌కు చెందిన డాక్టర్ విగ్నేష్ నరసింహన్ ఆ సమాధుల్లోంచి లభించిన అస్థిపంజరాల్లో ఒకదానిని ఎంపిక చేసుకుని అందులోని డీఎన్ఏను సేకరించి దానిని పరిశోధించారు. ఫలితాలను విశ్లేషించారు. ముందుగా ఈ డీఎన్ఏని శుద్ధి చేసి దాని ద్వారా జన్యు క్రమాలను రూపొందించారు. దానిని దేశంలోని మిగిలిన ప్రాంతాల ప్రజల జన్యువులతో పోల్చి చూశారు. ఈ పరిశోధనల్లో వారు కొన్ని ఆసక్తికరమైన విషయాలను కనుగొన్నారు. సింధునాగరికతకు చెందిన ఈ అస్థిపంజరంలోని జన్యువు ఉత్తర భారత దేశంలో నివసిస్తున్నవారి జన్యువులకు సరిపోలేదు. ఉత్తర భారత ప్రజల్లో ఉండే ఆర్1ఎ1 అనే ఒక జన్యువు సింధు-హరప్పా ప్రజల్లో లేదని స్పష్టమైంది. కానీ, ఈ అస్థిపంజరంలోని జన్యువులు దక్షిణ భారతదేశంలోని ప్రజల పూర్వీకుల జన్యువుతో పోలినట్లు తేలింది. ఈ తాజా పరిశోధన ఫలితాలు సింధు నాగరికత వైదికార్యులదేనంటూ కొంతమంది చేస్తున్న వాదనలను కొట్టిపారేసింది. వారి వాదనలు ఆధారరహితమని నిరూపించింది. హరప్పా, వేదనాగరికతలో భాగం కాదని తేలిపోయింది.

## సింధు ప్రజలు శ్రామిక వర్గాలే ...

సింధు నాగరికతలో వర్ణ సమాజం ఉన్నా వర్ణ వ్యవస్థలేదని ఇప్పటికే పరిశోధనలు చెబుతున్నాయి. అత్యధిక శాతం మంది అప్పటికే వైజ్ఞానికంగా సామర్థ్యం గల శ్రామిక వర్గాలేనని తవ్వకాల్లో బయటపడిన నగరాల తీరు, భవనాలు, భూగర్భ కాలువలు, స్నానవాటికలు, ధాన్యాగారాలు, రహదారులు, ఆనకట్టలు, బావులు, దీపస్తంభాలు వంటివాటి నిర్మాణం స్పష్టం చేస్తోంది. వీరు రాతిని గృహోపకరణాలుగా మలిచారు. కంచు, రాగి వంటి లోహాలను వినియోగించారు. ఈ లోహాల తయారీకి కార్ఖానాలు కూడా ఏర్పాటు చేసినట్లు తెలుస్తోంది. ఈ నాగరికత చివరిదశలో ఇనుప లోహాన్ని కూడా వినియోగించారు. వీరికి లిపి కూడా ఉంది. బార్లీ, గోధుమలు తదితర పంటలను పండించారు. ఏనుగు దంతాలను, నెమళ్లను, దంతాలతో రూపొందించిన దువ్వెనలను దూర ప్రాంతాలకు ఎగుమతి కూడా చేసేవారు. అక్కడ లభించిన ముద్రలు వారి చిత్ర, శిల్పకళని చాటిచెబుతుండగా, స్త్రీ మూర్తి విగ్రహం మాతృస్వామ్య వ్యవస్థకీ, ఎద్దుబొమ్మతో లభించిన ముద్రలు వ్యవసాయానికీ ప్రతీకలుగా నిలుస్తున్నాయి. ఇప్పటికీ దక్షిణభారత ప్రజల్లో ఎక్కువశాతం మంది శ్రామిక వర్గాలకు చెందినవారే. వివిధ వృత్తులపై ఆధారపడి జీవిస్తున్నవారే కావడం గమనార్హం.

## ఉత్పత్తి కులాల భాగస్వామ్యం

సింధు నాగరికతలో



ప్రధానంగా ఉన్న కొన్ని వృత్తులు నేటికీ దక్షిణ భారతదేశంలో కొనసాగుతూనే ఉన్నాయి. మట్టి కుండలు, పాత్రలను ఉత్పత్తిచేసే కుమ్మరులు, వస్త్రాలను రూపొందించే చేనేత పనివారు, నూలు వడికేవారు, పత్తిని తీసేవారు... ఇలా రకరకాల ఉత్పత్తి కులాల వారి భాగస్వామ్యం ఈ నాగరికతలో ఉందని ప్రముఖ మార్క్సిస్ట్ చరిత్రకారిణి రొమిల్లాథాపర్ తన రచనల్లో పేర్కొన్నారు. ఆమె క్రోడీకరించిన సింధు ప్రజల జీవన విధానం దక్షిణభారత దేశంలోని ఎన్నో ఉత్పత్తి కులాల్లో ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది. వ్యవసాయ సంస్కృతి విషయాన్ని వేరేగా చెప్పాల్సిన పని లేదు. ఆర్యులు కేవలం సంచార జీవనాన్ని గడిపే పశు పోషకులైతే అంతకుముందే సింధు ప్రజలు శాశ్వత నివాసాలు ఏర్పరుచుకుని స్థిర వ్యవసాయం చేస్తూ నాగరికంగా ముందున్నారు.

## సంస్కృతిలో సామీప్యత

సింధు ప్రజల ఆచార వ్యవహారాల్లోనూ, దక్షిణాది ద్రావిడ ప్రజల జీవనశైలిలోనూ ఎన్నో పోలికలు కన్పిస్తున్నాయి. ద్రవిడ భాషకు చెందిన బ్రహుల్ ప్రజలు సింధు ప్రాంత సమీపంలో ఇప్పటి పాకిస్తాన్‌లో 20 లక్షల మందికి పైగా ఉన్నారు. సింధు ప్రజలు వాడిన పూసలు వంటివే ఇప్పటికీ దక్షిణాదిలో మహిళలు ఎక్కువగా ధరిస్తున్నారు. అక్కడి మాతృస్వామ్య వ్యవస్థలోని అమ్మదేవతే.. దక్షిణాదిలో గ్రామదేవతగా మారింది. సింధు ప్రజలు పశుపతిని, లింగాలను పూజించేవారు దానికి కొనసాగింపుగా ద్రావిడుల్లో ఎక్కువగా శివారాధన, అమ్మతల్లిని పూజించడం వంటి ఆచారాలున్నాయి. వారు ఎద్దుకు ప్రాధాన్యత







ఇచ్చినట్లే దక్షిణదేశ సంస్కృతిలో కూడా ఎద్దుకు చాలా ప్రాధాన్యత ఉంది. ప్రతి శైవాలయంలోనూ నంది పేరుతో ఎద్దుని పూజిస్తారు. అంతేకాదు జనవరినెలలో సంక్రాంతి తర్వాతరోజు కనుమ పండుగను నిర్వహించి ఎద్దులకు అలంకారాలు చేస్తారు. సంక్రాంతి రోజుల్లో గంగిరెద్దులతో విన్యాసాలు కూడా చేయిస్తుంటారు. 'జల్లికట్టు'ను పోలిన సాహసక్రీడకు సంబంధించిన ఆనవాళ్లు సింధు నాగరికత ఫలకాల్లోనూ కనిపించాయి. సింధు ప్రజల వేషధారణలో కనిపించిన ధోవతి, ఉత్తరీయాలను ఇప్పటికీ దక్షిణాదిలో ఉండే ద్రావిడులు ధరిస్తున్నారు. సింధు ప్రజలు తమ మాతృ, పురుష దైవాలకు ఆలయాలు నిర్మించారు. అప్పటికి ప్రకృతి శక్తుల పేరుతో ఇంద్ర, మిత్ర, వరుణ, అగ్ని, సూర్య వంటివాటిని పూజించే రుగ్వేద ఆర్యులకు ఆలయ నిర్మాణమే తెలియదు. ఇప్పటికీ ద్రావిడులు అధికంగా నివసించే దక్షిణాది రాష్ట్రాల్లోనే అతిపెద్దవైన ఆలయాలను చూడొచ్చు. సింధు ప్రజలు తమ పూజల సమయంలో చేసే ధూపదీపాల నివేదనలు, నృత్యాలు, సంగీత వాయిద్యాల వాదనలూ ఎక్కువగా ఇప్పటికీ దక్షిణాది ఆలయాల్లో నిత్యం కొనసాగుతూనే ఉన్నాయి. సింధు నాగరికత తవ్వకాల్లో లభించిన పూజారి విగ్రహంలోని ఆహార్యాన్నే ఇప్పటికీ దక్షిణాది ఆలయాల్లోని అర్చకులు, క్రతువులు చేసేవారు అనుకరిస్తున్నారు.

## దక్షిణాదికి సింధు ప్రజల పయనం

ఆర్యుల దాడుల్లోనూ, 200-900 ఏళ్ల క్షామం, వరదలు (జల ప్రళయాలు)లోనూ చనిపోయిన వారు పోగా మిగిలిన వారిలో ఎక్కువమంది దక్షిణ భారతదేశానికి తూర్పు తీరం వైపు, మరి కొందరు గంగానది ముఖద్వారం వైపు వలస వెళ్లినట్టు చరిత్రకారులు భావిస్తున్నారు. నగరాల విధ్వంసం తర్వాత ఆర్య సంస్కృతి, అందులో భాగమైన వర్ణ వ్యవస్థ వేళ్లూనుకోవడంతో అనార్యులంతా శూద్రులయ్యారు. తమకు లోబడిన వర్తకులను వైశ్యులని పేర్కొంటూ వారితో వ్యవసాయాన్ని కూడా చేయించేవారు. సప్తసింధు ప్రాంతం ఆర్యుల ఆధిపత్యంలోకి వచ్చిన తర్వాత ద్రావిడుల వలసలు వాటి వివరాలను కొంతవరకూ తమిళనాడు ప్రాంతంలోని ప్రాచీన సంగం సాహిత్యం వివరిస్తోంది. చరిత్రలో మతం మిళితమై ఉండడం, మతాలను రాజకీయాలు అత్యధికంగా వినియోగిస్తున్న నేటి సందర్భాల్లో నిష్పాక్షికమైన చరిత్రని తెలుసుకోవడం, అధ్యయనం చేయడం చాలా వరకూ కష్టమే. కానీ లభిస్తున్న ఆధారాలను క్షుణ్ణంగా పరిశీలించి, పరిశోధించి అధ్యయనం చేయడం ద్వారా గతకాలపు పరిణామాలను సరిగా గుర్తించడానికి వీలవుతుంది

వివిధ ప్రయోజనాల కోసం చరిత్రని ఎవరికి వారే ఊహలతో రూపొందించుకుని, ప్రచారం చేసుకుంటున్న తరుణంలో నిజాలు వెలుగుచూస్తున్నకొద్దీ కొత్త కథలు కూడా ఎన్నో పుట్టుకొస్తుంటాయి. మతాలు, కులాల్లాంటివి మనుషులను విడదీయలేవని మానవ చరిత్రలో ఉండే విశ్వజనీనత ఎప్పటికప్పుడు నిరూపిస్తూనే ఉంటుంది. వివిధ సంస్కృతులు, సామాజిక అంశాలు, జన్యుక్రమాలు మానవజాతిని ఏకం చేస్తూనే ఉంటాయి. అయితే మూలాలను తెలుసుకోవడానికే ఇటువంటి పరిశోధనలు ఉపకరిస్తాయి. వీటిని వాదాలుగా మార్చుకుని ఒకరిపై మరొకరు ఆధిపత్యాన్ని సాధించాలనుకునే స్వార్థం ఎవరికైనా చారిత్రక విజ్ఞానపు వెలుగుల్ని చూడనీయలేదు. నాటి చారిత్రక మూలాలను నేటి సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిణామాలతో అన్వయించుకుంటూ పొరపాట్లని సవరించుకుని భవిష్యత్‌లో ప్రగతి దిశగా పయనించడమే సకల మానవాళి కర్తవ్యం. ★

### సింధు విధ్వంసకులు ఆర్యులే !

సింధు నాగరికత విధ్వంసకులు ఆర్యులే అన్న వాస్తవాన్ని వారి తొలి గ్రంథం రుగ్వేదమే తేటతెల్లం చేస్తోంది. రుగ్వేదంలోని ఆరవ మండలంలో పేర్కొన్న ఇంద్రుడు నిర్మూలించిన దస్యు నగరం పేరు 'హరియూపియ' ఇది హరప్పా అని చరిత్రకారులు చెబుతున్నారు. రుగ్వేదంలోని ఒకటో మండలంలో అగ్ని ద్వారా ధ్వంసమైన 'నార్మిని' నగరమే మొహెంజొదారో అని చరిత్ర పరిశోధకులు భావిస్తున్నారు. రుగ్వేదంలో సింధు నాగరికత విధ్వంసానికి సంబంధించి నలభై పళ్లకు పైగా భరతులు తదితర ఆర్య గణాలతో కలిసి దివోదాసు కిరాత శంబరునితో యుద్ధం సాగించాడని వివరించారు. దీనినే దస్యు హత్య అని పేర్కొన్నారని ఈ యుద్ధంలో దస్యులు పూర్తిగా ఓడిపోయారని రాహుల్ సాంకృత్యాయన్ తన 'రుగ్వేద ఆర్యులు'లో రాశారు. సింధు ప్రజలు వ్యవసాయం కోసం నిర్మించుకున్న ఆనకట్టలను విధ్వంసం చేయడం ద్వారా, అక్కడి నగరాలను (పురాలను) నాశనం చేయడం ద్వారానే ఇంద్రుడికి 'పురంధరుడు' అనే పేరుని రుగ్వేదంలో కల్పించారు. తమ శత్రువులైన సింధు ప్రజలను ఆర్యులు... నల్లని రంగుతో ఉన్నవారని, శిశ్నదేవులని (లింగపూజలు చేసేవారని) మృధ్రవచనులని (అసత్యాలు పలికేవారని) ఎన్నో చోట్ల రుగ్వేదంలో దూషణలు చేశారు. ఈ వర్ణనలను పరిశీలిస్తే ఉత్తరాదికి వలస వచ్చిన ఆర్యులు, అప్పటికే నాగరికులైన ద్రావిడులూ భిన్నమైనవారనే స్పష్టమవుతుంది. మొహెంజదారోలోనే... ఓ చోట చెల్లాచెదురుగా పడిఉన్న మృతుల అవశేషాలు బయల్పడ్డాయి. ఓ శిశువుని ఎత్తుకుని నేలకొరిగిన మహిళ, పక్కనే ఓ పురుషుడు (బహుశా భర్త కావొచ్చు)తో పాటు ఓ భీకర దాడి నుంచి తప్పించుకునే ప్రయత్నంలో హతులైన సమూహానికి చెందినదిగా ఆ సైటేని పరిశోధకులు భావిస్తున్నారు.